# ఆరుద్రపురుగు అమ్మాయి

డేవిడ్, బొమ్మలు:జాకీ, తెలుగు:కె. సురేష్



“నేను ఆరుద్ర పురుగు అమ్మాయిని!” వంటింటిలోకి వస్తూ తాన్సీ అంది.



ఆమె అన్న మోహిత్ పక్కన కుర్చీలో కూర్చుంది.

"ఆరుద్ర పురుగు గురించి నీకు తెలుసా?"

"ఆ," అన్నాడు అన్న. "అది అందరికి తెలుసు."



నాస్తా చేసిన తరవాత, "నాన్నకి, నాకు పనుంది. కాబట్టి మీ అంతట మీరు ఆడుకుంటూ ఉండండి. సరేనా?" అంది అమ్మ.



"నేను ఏం చెయ్యాలి?" తాన్సీ అడిగంది.

"నువ్వు ఆరుద్రపురుగు అమ్మాయివి. నువ్వు ఏమైనా చెయ్యగలవు, తాన్సీ!"



అన్న వెనకాలే తాన్సీ పరిగెత్తింది, “నువ్వు ఎక్కడికి వెళుతున్నావు?”

“శ్యామ్, మోహన్‌లతో కలిసి బేస్‌బాల్ ఆడటానికి వెళుతున్నాను.”

“నేను కూడా నీతో రావచ్చా?” తాన్సీ అడిగింది.

“లేదు, నువ్వు చాలా చిన్నదానివి,” మోహిత్ అన్నాడు.

“అదీకాక, ఆరుద్ర పురుగులు బేస్‌బాల్ ఆడవు.”



గట్టిగా ఊపిరి తీసుకుని తాన్సీ ఇంటి లోపలికి వెళ్లింది.

కుక్క బింగో ఆమెను అనుసరించింది.

ఇప్పుడు నేను ఏం చెయ్యాలి!



డ్రాయింగ్ రూమ్‌లో ఒక గోడకి అంతా పుస్తకాలే ఉన్నాయి. తాన్సీ కొన్ని అక్షరాలను మాత్రమే గుర్తు పడుతుంది, ఆమెకి ఇంకా చదవటం రాదు.



తరవాత ఆమె కుండీలో మొక్కకి నీళ్లు పోసింది. స్కేలుతో అది ఎంత పెరిగిందో కొలిసింది. కొన్ని రోజులు ఆ మొక్క అసలు పెరగనే పెరగదు.

తాన్సీ వంక బింగో తదేకంగా చూసింది, దాని అర్థం బయటకు వెళదామని.



బయట గడ్డి మీద మంచు బిందువులు ఉన్నాయి.
గడ్డి నుంచి చక్కటి వాసన వస్తోంది.
బింగో అటూ, ఇటూ వాసన చూసింది.

అప్పుడు, ఒక రాయి మీద నుంచి వెళుతున్న
చీమల బారొకటి తాన్సీకి కనిపించింది.



"ఈ రాయి మీ దారికి అడ్డంగా ఉందా, చీమలూ? దీనిని పక్కకి జరపటం మీకు చాలా కష్టం అయి ఉంటుంది కదూ?"  ఆమె అంది.





"నేను మీకు సహాయం చేస్తాను! నేను ఆరుద్రపురుగు అమ్మాయిని కదా!"

తరవాత ఆరుద్రపురుగు అమ్మాయి ఆ రాయిని తేలికగా పైకి ఎత్తి దూరంగా విసిరేసింది. ఇప్పుడు చీమల బారుకి అడ్డంగా ఏమీ లేదు!

“పద, బింగో!” అంది తాన్సీ.
“ఆరుద్రపురుగు అమ్మాయి చెయ్యవలసిన
పనులు ఇంకా చాలా ఉన్నాయి!”



తరవాత తాన్సీ పరిగెత్తుతూ చెరువు వైపు వెళ్లింది. మోహిత్ దానిని "నీటి మడుగు" అంటాడు.

కానీ, అందులో చెట్లు, ఆకాశం కూడా కనపడతాయి కాబట్టి అది లోతైన చెరువని తాన్సీకి తెలుసు.

ఆ లోతైన నీటిలో సొరచేప దాక్కుని ఉన్నా కూడా ఆశ్చర్య పోనవసరం లేదు!



తరవాత ఆరుద్రపురుగు అమ్మాయి
అందులోకి దూకింది!



అది అయిన తరవాత రాళ్లతో కట్టిన గోడ దగ్గరకు తాన్సీ వెళ్లింది.
దానికి తాన్సీ సహాయం ఎంతైనా అవసరం ఉంది.
కింద పడిన రాళ్లను ఏరి గోడ మీద పెట్టింది తాన్సీ.
దాంతో, గోడ ముందు కంటే ఎత్తుగా అయ్యింది.

ఆ రాతి గోడ ఒక కోట లాగా ఉంది.





మైదానంలో పడి ఉన్న పెద్ద చెట్టు కూడా ఇప్పుడు తాన్సీని ఆపే స్థితిలో లేదు! ఆ చెట్టు వేళ్లు కోపంగా ఉన్న పాములు లాగా ఉన్నాయి. కానీ, ఆరుద్రపురుగు అమ్మాయి ఎగురుకుంటూ, ఒక్కసారి కూడా కింద పడకుండా ఆ చెట్టు మీద చివర దాకా వెళ్లింది.



తరవాత ఆమె దాని మీద నుంచి కిందకి దూకింది.

వంగి, అభివాదం చేసింది.

“ఎంతో బాగుంది కదా!” అంది తాన్సీ.

ఔనన్నట్టు బింగో తలూపింది.



అప్పుడు ఉన్నట్టుండి బంతిని బ్యాట్‌తో కొట్టిన శబ్దం వినిపించింది. వెనక్కి తిరిగి చూసిన తాన్సీకి తన వైపే వస్తున్న బంతి కనిపించింది.

“ఆ బంతిని ఇటు విసిరెయ్యి!” అన్న మోహిత్ అరిచాడు.



బంతిని పట్టుకుని తాన్సీ విసిరేసింది.



కానీ, ఎందుకో గానీ అది ఆమె కాళ్ల దగ్గరే పడింది.

“ఇప్పుడు నేను మీతో ఆడవచ్చా?” పరిగెత్తుతూ వస్తున్న అన్నని తాన్వీ అడిగింది.

“లేదు,” మోహిత్ బదులిచ్చాడు, “ఈ ఆట ఆడటానికి నువ్వు ఇంకా చిన్న పిల్లవని ఇంతకు ముందే చెప్పాను కదా!”

బంతిని తీసుకుని అన్న వెనక్కి పరిగెత్తాడు.



అన్నవైపు తాన్సీ కోపంగా చూస్తూ ఉండిపోయింది.





తరవాత తాన్సీ గడ్డి మీద పడుకుంది. సూర్యుడి కిరణాలు ఆమె బుగ్గలను తాకుతున్నాయి.

ఇప్పుడు తాను ఇంకా చిన్న పిల్లని కానని ఆమెకి అనిపించింది.

పుస్తకాలలో తాను గుర్తు పట్టిన అక్షరాలను గుర్తుకు తెచ్చుకుంది. ఎంతో ధైర్యంగా చీమల కష్టాన్ని తొలగించింది. చెరువులో సొరచేపలు ఉన్నా భయపడకుండా అందులోకి దూకింది. ఒక చక్కటి కోట తయారు చేసింది. పడిపోకుండా చెట్టు మోడు మీద ఆ చివరి నుంచి ఈ చివరి దాకా నడిచింది.

ఈ పనులన్నింటినీ ఆమె ఒంటరిగా చేసింది!!

ఉన్నట్టుండి వీచిన గాలికి పండిన ఆకులు రాలి
అటు వచ్చాయి.
తాన్సీ లేచి కూర్చుని ఆ ఆకుల వెనక
పరిగెత్తింది.
ఎగురుతున్న ఆ ఆకులను ఆరుద్రపురుగు
అమ్మాయి గాలిలో పట్టుకుంది!
"ఆరుద్రపురుగు అమ్మాయి ఇప్పుడు చిన్నా,
చితకది ఏమాత్రం కాదు!" అంటూ
తాన్సీ అరిచింది.





తరవాత కొండ ఎక్కి యాపిల్ చెట్టు కొమ్మ మీద కూర్చుంది తాన్సీ.

అక్కడినుంచి స్నేహితులతో ఆడుతున్న అన్న కనిపించాడు.

వాళ్లు ఏదో వాదించుకుంటూ ఉన్నారు.

ఇప్పుడు తాన్సీకి ఆ ఆట పట్ల ఏమాత్రం ఆసక్తి లేదు.

అంతకంటే ఎక్కువ ఆనందాన్ని ఇప్పుడు ఆరుద్రపురుగు అమ్మాయి పొందుతోంది!



బొటనవేలు, చూపుడు వేళ్లతో గుండ్రంగా చేసి ఆ రెండింటి కంతల నుంచి వాళ్లందరినీ చూస్తోంది.

“నేను చిన్నపిల్లను ఏమీ కాదు,” అంటూ ఆమె అరిచింది.





తాన్సీ కొంచెం సేపు అలాగే కూర్చుంది. గోరింకలు, పాలపిట్టల పాటలు వింటూ ఉంది.





అప్పుడు అమ్మ తనని పిలవటం వినిపించటంతో తాన్సీ చెట్టు మీద నుంచి దిగింది.

“పద, బింగో!  ఇంటికి వెళ్లి పొద్దున నుంచి ఏమేమి చేశామో అమ్మా, నాన్నకి చెపుదాం!”

తాను పెద్దదానిని అయిపోయానని తాన్సీ అనుకుంది.
బయట మైదానం అంత విశాలంగా ఆమె మనసు ఉంది.
ఆమె తన రెండు చేతులను బార చాచి ఎగురుకుంటూ కొండ
దిగుతోంది. ఆమె వెనక ఆమె రెక్కలు రెపరెపలాడాయి.



